సంపుటము 1] మార్చి 1915 [సంచిక 9




# బాలమిత్ర

1. నూతన మిత్రుని — ముదముతో గంటిమి
త్రేతములబంగిని — సంతసమొసగును.
2. నయము నీమిత్రుని — యనుమతిగోరెడి
బాల బాలికలకు — యలనడు జ్ఞానము.
3. లతకూనలకును — సత్యము దెలుపను
మిత్రముపగిదిని — కతలను జెప్పును.
4. త్రస్తముగల్గును — శ్రద్ధనబరచుని
స్తుతివందనములు — ముదముతో జేయును.

## ఇటుకమీద వ్రాయబడిన కథ

చాలకాలము క్రిందట, ప్రస్తుతము 'అర్మినియా' యని పిలువబడు దేశమున, కాగితముమీద కలముతోను సిరాతోను వ్రాయుటకు తెలియక పూర్వము, ఇటుకమీద వ్రాసేవారు. చిన్న పిల్లలందరును చదువను వ్రాయను నేర్చుకొనుటకు బడికి వెళ్లువారుగాని, వారి బళ్లు మన బళ్లవంటివిగావు. ఇసుకమీదగాని, పలకమీదగాని వ్రాయ నేర్పుటకు బదులుగా,

వారి పంతులుగారు వారికి కొంత మట్టిముద్దను, ఒక పుల్లను ఇచ్చి, వాటిమీద వ్రాయ నేర్పేవాడు, పెద్దవారుకూడా ఆవేలాగున చదరపు మట్టి ఇటుకలమీద వ్రాసి, దానినెక్కువ కాలముంచవలెనని కోరినయెడల, ఒక ఆవములో పెట్టి కాల్చువారు. ఇది చాల చిత్రమైన వాడుకయైనను చాల ఉపయోగకరమైనదై యుండెను. ఈ విధముగా ఇంతకాలమువరకు స్థిరముగానున్న వీటిమీద వ్రాయకపోయినయెడల ఆ కాలమందు జీవించినవారి చరిత్రనుగూర్చి ఎవరికిని తెలిసి యుండకపోవునదే. గత శతాబ్దములో అప్పుడప్పుడిట్టి వ్రాత యిటుకలు భూమినుండి త్రవ్వి యెత్తబడెను. వివేకవంతులైన వారు వీటిని జూచినప్పుడు ఈ వింత వ్రాతను కనుగొనజాలక పోయిరిగాని, చాలకాలమువరకు బాగుగ యోచించినపిదప వారు వాటిని చదువగలుగు మార్గము కనుగొనిరి. వాటిని చదువగలిగినపిదప ఆ దేశపు చరిత్రంతటిని ఆ దేశపు జనులను గూర్చియు అనేక వందల సం॥ల క్రిందట వీటిని వ్రాసిన వారినిగూర్చియు తెలిసికొనిరి. వీటిలో చాల ఆయా దేశముల వారికి కలిగిన గొప్ప గొప్ప యుద్ధములనుగూర్చి పోరాటములనుగూర్చి వ్రాయబడెనుగాని, కొన్ని విచిత్రములగు కథలు గూడ కలవు. వాటిలో నొకటి, ఒక తల్లినిగూర్చి—ఈమెకొక్క చిన్ని ముద్దుబిడ్డడుండెను. ఈమె చాల బీదరాలై

యుండెనుగాన దానికి కావలసిన అన్నవస్త్రాదుల నియ్యజాల కుండెను. అందువలన ఆమె కలిదుఃఖము కల్గెను. చివరకు తనకంటె ఆ బిడ్డను బాగుగా చూడగల్గిన ఇంకెవ్వరికైన నాతని నిచ్చివేయగోరెను. గాని ఎవరికియ్యవలెనో తెలియక పోయెను. గనుక ఒక మంచి ఉపాయము నన్నెను. ఒక గంప తెచ్చి, దానిలోకి నీరు పోకుండునట్లు తాకుపూసి బిడ్డ నంటులో బెట్టి మోసికొనిపోయి, ఏటియొద్దున నుంచెను. ఎవరైనా అక్కడకు వచ్చి వాని కనుగొని పెంచుకొందురను నమ్మకముతో నాలాగు జేసెను. కొంచెము సేపటిలోనే, ఆ యేటి విచారణకర్త అక్కడికి వచ్చి, ఆ బిడ్డ ఏడ్పు విని, వెళ్లి వాని కనుగొనెను. వాని నింటికి తీసికొని వెళ్లగా అతని భార్యయు సంతోషించి, వానికి సార్గన్ అను పేరుపెట్టి, తమ స్వంత బిడ్డవలెనే చూచుకొనిరి.

అతనికి కొంచెము వయస్సు వచ్చినపిదప బడికి పంపిరి. అతడక్కడ యిటుకలమీద వ్రాయుట నేర్చుకొనెను. మరియు, తాను చేయగలిగినదంతా, అది ఎంత కొద్దిపాటిదైనను బాగుగా చేయ నేర్చుకొనెను. అతడు పెద్దవాడైనపిదప తోట మాలియయ్యెను, గాని అతడు చూపిన తెలివిని జ్ఞానమును చూచి ఆ పట్టణస్థులతనిని తమకు రాజుగా చేసికొనిరి. అతడు చాల బలశాలియై తన ప్రజలను మంచి స్థితిలోకి

తెచ్చెను. దేశమును బాగుచేసెను. అతడు చనిపోయిన పిదప ఈ పేదపిల్లవాడు పెంచుకొనబడి రాజైన కథ నెవరో యిటుకమీద వ్రాసిరి.

---

## చక్రవర్తి, ముసలివాడు

ఒకనాడొక చక్రవర్తిగారు ఒక ముసలివాడు మామిడి చెట్టు నాటుట చూచెను. వానిదగ్గరకుబోయి, "తాతా! ఎందుకు దీని నాటుచున్నావు? నీవు పడుచువాడవుగా నున్నప్పుడు బాగుగా పనిజేసి యుండినయెడల, ఇప్పుడు సుఖముగా కాలుమీద కాలు వేసికొని యుండేవాడవే. అదిగాక, ఈ చెట్టు పండ్లు తిన గోరుచున్నావా యేమి? ఎందు కింతకష్టము?" అని అడిగెను. అందుకా ముసలివాడు "అయ్యా! నేను నా పడుచుతనములో బాగా కష్టపడి పనిచేసినవాడను. ఇంకను చేసెదను. దేవుని దయ యున్నయెడల ఈ చెట్టు పండ్లు కూడ తిందునేమో! ఎవరికి తెలుసును?" అనెను. "నీ వయస్సెంత?" అని రాజడిగెను. "నూరేండ్లు" అని ముసలివాడు జవాబు చెప్పెను. "మంచిది, ఈ మామిడిచెట్టు కాయలు పండేవరకు నీవు జీవించి యున్నయెడల నాకు తెలుపవలసినది" అని రాజు చెప్పి వెళ్లిపోయెను.

ఆ ముసలివాడు దేవుని దయవలన బ్రతికి, ఆ పండ్లు పండినప్పుడు రాజుగారి వాక్యములను జ్ఞప్తిచేసికొనెను. ఒక



చిన్నగంపను ఆ చెట్టు పండ్లతో నింపి రాజనగరుకు వెళ్లెను. అతడు రాగానే రాజుగారు అతనిని చాల మర్యాదజేసి కూర్చుండ బెట్టెను. అంతట అతడు తాను ఇంకా బ్రతికియున్నాననియు, ఆయన కొక బుట్టెడుపండ్లను బహుమతిగా తెచ్చితిననియు తెలియజేసెను. రాజుగారు చాల సంతోషించి వాని గంపనిండ పండ్లకు బదులుగా బంగారపు శౌరీలతో నింపి వానియింటికి పంపివేసెను.

ఈ ముసలివాని యింటి ప్రక్కను మరియొక ముసలి వాడు తనభార్యతో కాపురముండెను. అతనిభార్య ఈ సంగతివిని, తనపెనిమిటికూడ ఆలాగే చేయవలెనని కోరెను. అంతట వారొక పెద్దబుట్టను పండ్లతో నింపగా, ముసలివాడు

రాజమందిరమునకు దాని నెత్తుకొనిపోయెను. అక్కడ చేరిన పిదప వాడు రాజుగారి సేవకులతో, "రాజుగారికి మామిడి పండ్లు చాల యిష్టమట. వీటిని తీసికొని ఈ బుట్టను శౌరీలతో నింపి ఇమ్మని" యడిగెను. వారీ సంగతిని రాజుగారికి తెలిపిరి. అప్పుడాయన వానిని దోవలో నిలువబెట్టి పండ్లతో గొట్టుడని ఆజ్ఞాపించెను. ఎందుకనగా వీడు ఈ పండ్లను కొని తెచ్చెనేగాని వాటికొరకు పనిచేయలేదు. గాని మొదటివాడు తనచేతులతో పనిచేసి వానిని పండించెను. దేవుడు పనిచేయువారి నాశీర్వదించి, వారివారి పనికి తగినట్లు ఫలమను గ్రహించును.

---

# చిరుతపులి

ఒకనాటి రాత్రి ముసలివాడొకడు తన మనుమనితో గూడ ఒక అడవిలో గడుపవలసి వచ్చెను. అక్కడొక పాడుపడిన ఇల్లుండగా వారు దానిలో నిద్రింప వీలుచేసికొనిరి గాని దానికి నాలుగవ వైపున అడ్డమేమియు లేదు. ఆ ప్రాంతములలో నొక చిరుతపులి, తిరుగుచుండున దని జనులు చెప్పుకొనువారు. దానికి పిల్లలనిన బహు ఇష్టమై యుండెను. ఆ ముసలివాడు తెల్లవారుజామున 2-గంటలవరకు మేలుకొని

యుండెను. గాని తరువాత కొంచెము కునికిపట్టి నిద్రించెను. నాలుగు గంటలకు లేచుసరికి ప్రక్కన పిల్లవాడు లేక



పోయెను. ఆ పిల్లవాడు పండుకొనినప్పుడు ఒక ముతకదుప్పటిలో వానిని చుట్టెను. ఆ చిరుతపులి వచ్చి వాని నా బట్టతోనే పట్టి ఎత్తుకొని వెళ్లిపోయెను. దానిపండ్లు వాని కుడి చెవిలోనికి దిగబడెను. గనుక బరువున కది చీలెను. చిరుతపులి నోటితో పట్టుకొనినది ఆ భాగమును మాత్రమే గనుక ఆ పిల్లవాడు జారి క్రిందబడెను. అది ఆ దుప్పటిని మాత్రము మోసికొని వెళ్లిపోయెను. చాలదూరము పోయిన తరువాత పిల్లవాడు లేనిసంగతిని అది కనుగొని తిరిగివచ్చెను గాని ఇంతలో తాతమేలుకొని దానిని కర్రతోగొట్టి వెనుకకు

తోలెను. అది యనేకసారులు వచ్చెను గాని మాటిమాటికిని వాడు దానిని బాగుగా కొట్టినందున అది వెనుకకు తిరిగి పోయెను. ఉదయమున వానిని ఆసుపత్రికి తీసికొనివెళ్లగా వాని చెవిని కుట్టిరి. ఆ రాత్రి ఆ ముసలివాడును, ఇంక ముగ్గురు నలుగురును ఆ గుడిసెకువెళ్లి దానికొరకు రాత్రి 12-గంటలవరకు కనిపెట్టిరి గాని, దానికి వీరుగాని, వీరి తుపాకులుగాని అవసరము లేనందున రానేలేదు.

---

# ప్రకృతి పాఠములు

8-వ పాఠము

## పండ్లు (ఫలములు)

పువ్వు వాడిపోయి, రాలిన పిదప, పువ్వుకాడ కేదో యొకటి మిగిలియున్నట్లు చూడగలవు. పువ్వుయొక్క అందమంతయు నశించినది. రంగులతోను, సువాసనతోను, రేకులతోను నిండి మనస్సు కానందము కల్పించినపువ్వు అంద హీనమై కాంతి తగ్గి, ఎండిపోయి క్రిందబడినదిగాని, గుండ్రనిది కాడ చివరను మిగిలియుండి, దినములు గతించినకొలది పెద్దది యగుచున్నది. ఏమిటిది ? ఒకదానిని తీసికొని జాగ్ర

తగా విడదీయును. దానియందు చిన్న విత్తనము లుండును. గాన దీనిని విత్తనములసంచి యనవచ్చును.

ఇక్కడ చూపబడినది గులాబి విత్తనములసంచి పటము.




రెండవది దానియొక్క లోపలిభాగమును జూపును. దానినిండ విశేషసందు లేకుండ విత్తనము లున్నట్లు చూడవచ్చును. వీటికితప్ప మఱి దేనికిని దానిలో స్థలములేదు, ఇట్టివానిని "పండు" అని అనము. ఇట్టివి పండ్లు కానేరవు. పండ్లయం దుండు పదార్థము దీనిలో నేమియు లేదని చెప్పవలసినది. మామిడిపువ్వు రాలిన తరువాత చూడుము. అక్కడకూడ చిన్నమొగ్గవంటి గుండ్రనిది కనుబడును. గాని క్రమక్రమముగా పెద్దది యగుచున్నది. వీనిలో కొన్నిపండ్ల విత్తనములు పెద్దవిగాని మరికొన్ని చాల చిన్నవిగా నున్నవి. తినుటకు వీలయిన పదార్థము వేనిలో నెక్కువగా నుండునో అట్టి వానిని "పండ్లు" అని యందురు. పండ్లు అనేక తరహాలుగా నుండును. అనేక రంగులుగలవి. పరిమాణమునం దనేక భేదములు గలవు. ఆకారమునందు అనేక విధములుగా భేదించును. పుచ్చ, గుమ్మడి, సొర, పనస మొదలగునవి మిగుల పెద్దవి. పెద్దపెద్ద ఫలములనిచ్చెడి చెట్లు చిన్నవిగాను, ఎత్తు

లేనివిగా నుండును. ఎత్తైన చెట్లయొక్క పండ్లు సాధారణముగా చిన్నవి. మఱ్ఱిచెట్టుకాయలను గుర్తింపుడు.

పండ్లలో అనేకముల విత్తనములే ముఖ్యముగా మనుష్యుల కుపయోగపడుచున్నవి. ధాన్యము, బటాణీలు, నూనె విత్తులు మొదలగునవి తగిన దృష్టాంతములు. వీనిని మనము పండించుకొందుము. తిను అన్నము, రొట్టెలను, మిఠాయిలు మొదలగువానిని జేసికొందుము. ఇవి మనము జీవించుట కెంత ముఖ్యమో తెలిసికొంటిరా?

పండ్లేలాగు కలుగుచున్నవో తెలియునా? పుష్పము లేలాగుననో పండ్లుకూడ అదేలాగున "రసము" వలననే కల్గినవి. పువ్వులు సౌందర్యము నిమిత్తమును, పండ్లు మన ఉపయోగము నిమిత్తమును సృజింపబడెను. పువ్వుల ద్వారా దేవుడు తన సంతోషకరమైన ముఖమును కనుపర్చుచున్నాడు. పండ్లద్వారా దేవుని ఆశీర్వాదములు మనకు వచ్చుచున్నవి. పువ్వులు కంటి కింపుగా నున్న యెడల పండ్లు కడుపు కింపుగా నున్నవి. పువ్వుల చక్కదనమును, పండ్ల ఉపయోగమును ఏలాగు జతగా నున్నవో అలాగే దేవుడు మనకిచ్చిన చక్కని శక్తులను, ఇతరుల ఉపయోగము నిమిత్తము వాడవలెను. దేవుడు మన కెట్టి మేలుల నిచ్చుచున్నాడో గుర్తించితివా?

# బైబిలు పిల్లలు

## దేవుని స్నేహితుడగు అబ్రాహాము

అబ్రాము తెరహు అను ఒక ధనవంతుని కుమారుడు. ఇతడు నోవహు కుమారుడగు షేము యొక్క సంతతివాడు. ఇతని తండ్రి దేశము "కల్దీయుల ఊరు." ఈ దేశరాజునకు మిగుల అందమైన నగరము ఉన్నది. ఇందలి జనులకు గొప్ప గొప్ప పాఠశాల లుండెడివి. ఇచ్చటి జ్ఞానులు పగలు ఆకాశము రాత్రి నక్షత్రములను పరీక్షించి గొప్ప జ్యోతిష శాస్త్రమునందు మంచి నేర్పరితనము జెందియుండిరి. ఈ దేశమునందు మంచి పుస్తకశాలలు (లైబ్రెరీలు) గలవు. ఇందలి పుస్తకములు మంటితో చేయబడినవై యున్నవి. మనము ఇప్పుడు మనబడులలో తడిమట్టితో చిన్నచిన్న వస్తువుల జేయుటకు మన ఉపాధ్యాయులు నేర్పుట చూచుటలేదా? తడిగా యున్నప్పుడు కథలు మొదలైనవాని వ్రాసి, ఇటుకల కాల్చినట్లు కాల్చెడివారు. ఎన్నటికి వ్రాత చెడక భద్రముగా నుండెడిది. ఇట్టి మంటితో జేయబడిన పుస్తకములు చిత్ర వస్తువులనుంచు శాలలందు (మ్యూజియములందు) చాలా కాలమువరకు జాగ్రత్త చేసిపెట్టి యుంచిరి. ఇంత ఘనమైన పట్టణమున మనము చదువు బాలుడగు అబ్రాము ఉండెను.

పసివాడైన అబ్రాము దేశమందలి చిత్రముల చూచుచు, సంతసించుచు, దేశవాసులు కొలుచు సూర్య చంద్ర నక్షత్రముల తానును కొలిచెడివాడు. ఆలోచనపరుడగు అబ్రాము సూర్య ప్రకాశమును జూచి మనమున సంతోషించి, సూర్యుని కన్న లోకమున గొప్ప దేదియు లేదని తలచి పూజించెను. గాని పగలు ముగియగనే సూర్యుడు మరుగైనందున సూర్యుడు తాను తలచినంత గొప్పవాడు కాడనియు ఇక దాని పూజింపనని నిశ్చయించుకొనియె. ఇట్లుండ కొంచెముసేపునకు చల్లని చంద్రుడు ఆకాశమందు గాన్పించెను. అంత అబ్రాము చంద్రుడు సూర్యునికన్న గొప్పవాడు. అంధకారమును పారదోలి చల్లనికిరణముల కాంతితో ప్రకాశించుచున్నాడని మెచ్చుకొని దాని పూజించుచుండెను. గాని కొంతకాలమునకు, చంద్రుడును మరుగై, చీకటి మయమైన ఆకసంబున చుక్కలు కాన్పించెను. ఆహా ఇవే అన్నిటికంటే ఎక్కువైనవని తలచి మహా ఆనందమొందుచుండ నక్షత్రములు పోయి మరల సూర్యుడు గాన్పించెను. అంతట అబ్రాము "ఇదేమి? సూర్య, చంద్ర, నక్షత్రములు, అంత గొప్పవి కావు. వీటిని సృజించిన మహానుభావుడొకడు ఉండితీరవలెనని యోచన మనస్సున కలుగగా అట్టి సృష్టికర్తను ఆరాధించ మొదలు పెట్టెనట. ఆహా! బుద్ధికుశలతగల బాలుడు ఇంత జ్ఞానముతో

సమస్త సృష్టి వైచిత్రముల జూచి, వీని జేసినవాడు ఒకడు ఉండునని తలచి, అట్టి నిజదేవుని సేవింతురు.

దినములు గడిచెను. అబ్రాము, తన పొరుగువారివలె గాక సత్యదేవుని కనుగొని, ఆయనను సేవించుచుండెను. ఇట్టి సమయమున దేవుడు అబ్రామును తాను చూపించు దేశమునకు పొమ్మని ఆనతివ్వగా "ఎందుకు, ఎక్కడకు" అను వ్యర్థ ప్రశ్న లడుగకయే దేవుడే తన్ను నడిపించునని పూర్ణ విశ్వాసము గలిగి తండ్రియగు తెరహు సెలవు దీసికొని, భార్య శారతోను, అతని అన్నకుమారుడగు లోతుతోను అనేకమంది దాసులు, దాసీలు, పశువులు గుఱ్ఱములు, ఒంటెలు మొదలైన వానితో బయలుదేరెను.

(సశేషము)

---

# బాలమిత్ర టపా

ప్రియబాలమిత్రులారా!

నేను మీతో ఒక మంచి కథ చెప్పగోరుచున్నాను

ఒక మనుష్యుడొక గంపెడు జేనపండ్లు నెత్తిమీద పెట్టుకొని బజారుకు తీసికొని పోవుచుండగా మూడు నాలుగు జేనపండ్లు క్రింద పడిపోయెను. ఆ పండ్లు పడిపోయినవని ఆ




మనుష్యుడు గ్రహించలేదు గనుక ఆ పండ్లు తీసికొనకయే తన త్రోవను వెళ్లిపోయెను. గాని యొక పేద చిన్నవాఁడవి పడుటను చూచి యేరి ఎత్తెను. ఆ చిన్నవాఁడు ఇదిగో ఇదిగో! అని వానిని అఱవఁగా అతఁడా మాట విని వెనుకకు తిరిగి నిలిచెను. ఆ బాలుఁడా పండ్లను తీసి ఆ మనుష్యుని చేతిలో పెట్టెను. ఆ మనుష్యుఁడా పండ్లను తీసికొంటూ ఆ బాలునికి వందనము చేసినపిమ్మట తన గంపను క్రిందికి దింపి ఆ బాలునితో అబ్బాయీ నీవు చాలా మర్యాదగల బాలుడవు గనుక నీ కిష్టమైన పండును తీసికొనుమనెను. ఆ మనుష్యుడు వెళ్లిన పిమ్మట మరియొక చిన్నవాఁడా బాలునియొద్దకు వచ్చి

వానికి దొరికిన పండ్లన్నిటిని నీవు ఉంచుకొని యుండవలసి నది. అప్పుడు వానిలో కొన్నిటిని నాకును ఇయ్యగలిగి యుండేవాడవు అనెను. అందు కా బాలుడు నీకు కావలె నంటే ఈ జేనపండును తీసికోవచ్చును. ఎందుకనగా ఇది నాది గనుక నే నియ్యవచ్చును. అయితే వాటిని నే నిచ్చి యుండినయెడల నేను దొంగవాడ నౌదును గదా. నేనెంత పేదబాలుడనైనను నా మంచిపేరును ఆ పండ్లు నీకిచ్చినయెడల పోగొట్టుకొనేవాడను. నావంటి బాలురారా! ఈ కథ మనకు దెలుపు నీతులను జూతము.

మనకు ఒకరివస్తువు దొరికినపుడు దొరికినవస్తువుకు దొంగా! యను మన దేశపు దుర్వాడుక మాట నాధారము చేసికొని ఆ వస్తువు పోగొట్టుకొనినవానికి నియ్యక మనమే వాడుకొం దుము గదా! ఈ మంచి బాలు డట్లుచేయలేదు. ఆ పండ్లు జారిపోయిన సంగతి యా పెద్దవా డెరుగక పోయినను, ఆబాలు డతని పిలిచి యా పండ్లతని కిచ్చెను. ఆ బాలుడెంత బుద్ధిమం తుడు మనము పోగొట్టుకొనిన వస్తువును తెచ్చి ఇచ్చినవాని కేమిచేతుము? ఏమియు చేయముగదా? ఆ పెద్దవా డట్లుకాదు గంపదింపి ఆ బాలుడు కోరినపండు నిచ్చెను. మనమట్లు చేయక పోయినను ఆ పెద్దవాడు చెప్పినట్లు కృతజ్ఞతగల మనస్సుతో వందనము లేక సలామైనను చెప్పుదము. రెండవ చిన్నవాని

బుద్ధి చూచినారా? ఇంతవరకు మన సాధారణబుద్ధి అట్టిదే. మొదటివాని జవాబు లెంతమంచివి. నాదికానివాటి నిచ్చిన యెడల దొంగనయ్యేవాడను నేనెంత పేదవాడనైనను నా మంచిపేరును పోగొట్టుకొనను. ఆహా! ఇట్టి మంచి బుద్ధి గట్టి తలంపు నీకును నాకును కలుగునుగాక.

మురారి దేవసహాయము మూడవ తరగతి
తర్లుబాడు, నెల్లూరు జిల్లా

---

## దేవుని వాక్యమును నీ హృదయములో దాచుము

నీ యాత్మ పెరుగునట్లు సహాయపడుటకు తెలివియు జ్ఞానమును గ్రహింపగల మనస్సు నీకున్నందునను, చదివి గ్రహించునట్లుగా నీ కొరకై దేవుడు తన వాక్యమును ఒక గ్రంథములో వ్రాయించినందునను, నీకాలములో నెక్కువభాగమును బైబిలు చదువుటలో నుపయోగింపవా? కొంతకాలమునకు నీవు చదువలేకుండ గ్రుడ్డివాడవైనయెడల నీకు సహాయకరముగా నుండునట్లు దేవుని వాక్యమును నీ మనస్సునందుంచుకొనుము. వాటిని బాగుగా కంఠపాఠము చేయుము. నీయాత్మ వాటిని ధ్యానించి ఆకలిగొనినప్పుడా వాక్యమును భుజించి తృప్తినొందులాగున శ్రద్ధపుచ్చుకొనుము. తన చిత్తప్రకారము మనము చేయ నేర్చుకొనుటకై దేవుడు మనకు మనస్సుల ననుగ్రహించెను.

C. L. S. PRESS, MADRAS—1915